

PALAPITTA

# పాలపిట్ట

మాసపత్రిక

సంపుటి: 1 సంచిక: 1 పేజీలు: 84 ఫిబ్రవరి 2010

ఉపేక్ష వీడితేనే తెలుగుకు భవిత

అత్యాధునిక కవి నారాయణబాబు

శివరాజు సుబ్బలక్ష్మి జ్ఞాపకాలు

గోపీచంద్ రచనల విశ్లేషణ

సీమ వీరవనిత కథ మునెమ్మ

వెండితెరపై 'చే' పోరాటకావ్యం

దేవులపల్లి కృష్ణమూర్తితో ఇంటర్వ్యూ



వెల: రూ.30/-

# పాలపిట్ట

మాసపత్రిక

సంపుటి:1 సంచిక:1

ఫిబ్రవరి 2010





## వ్యాసాలు



## కథలు



## అనువాద కథలు



## పాట







## కవితలు



## బాల సాహిత్యం



## సమీక్షలు



## ఇంటర్వ్యూ



## జ్ఞాపకాలు



## సినిమా



## చిత్రకళ



Printed, Published, Edited and Owned by Gudipati Venkateswarlu, H.No. 16-11-20/6/1/1, 403, Vijayasai Residency, Saleem Nagar, Malakpet, Hyderabad - 500 036, A.P., and Printed at Vipla Computer Services (Designers & Multi Colour Offset Printers) 1-8-725A/1/A, Balaji Bhagyanagar Apts., Nallakunta, Hyderabad - 500 044.A.P. **Editor: Gudipati Venkateswarlu**

■ కథ / దార్ల రవికుమార్



# అంతేనా....ఇంకేమి కావాలి?

గవర్నమెంటు ఉద్యోగమైనా ఆమెకి మా ఆవిడ కంటే ఎక్కువ జీతమే వస్తుంది. పైగా దూరం వెళ్ళక్కర్లేదు! మా ఆవిడకి ట్రాన్స్‌ఫర్ కోసం ఎంత ప్రయత్నించినా...ఖాళీల్లేవంటున్నారు. లెక్చరర్స్ యూనియన్‌లో ప్రధానమైన పోస్టులన్నీ దళితేతరులవే. బదిలీల్లో యూనియన్ పాత్ర చాలా ముఖ్యం. స్పౌజ్ కేసని చెప్పినా, హెల్త్ గ్రౌండ్స్ అని ఆధారాలు చూపినా దగ్గర్లో పోస్టింగ్స్ మాత్రం రావట్లేదు. సర్వీసు తక్కువున్నా, సిటీ దగ్గర్లో దళితేతరులకు మాత్రం బాగానే ట్రాన్స్‌ఫర్స్ జరుగుతున్నాయి. బదిలీ లీలలు ఏలిన వాళ్ళకే తెలియాలి. రికమండేషన్స్‌కే తెలియాలి. అవినీతికే తెలియాలి.

రాత్రి ఎనిమిదిన్నర కావొస్తుంది.

ఇంట్లో అటు ఇటు తిరుగుతున్నాను, ఎందుకు తిరుగుతున్నానో నాకే తెలీదు. చేతిలో సెల్ వైపు, గడియారం వైపు చూస్తున్నాను. ఫోన్ ఇంకా మోగట్లేదు!

సరే...చూద్దాం అనుకుంటూ ఏమీ తోచక.... అప్రయత్నంగానే రిమోట్ నొక్కాను, టీ.వి.లో ఏవో కార్యక్రమాలొస్తున్నాయి. రిమోట్ నొక్కుతున్నాను. దేన్నీ నిలకడగా చూడ్డం లేదు. అప్రయత్నంగా వేళ్ళు రిమోట్‌తో ఆడుకుంటున్నాయి. సెల్ ఫోన్ ఇంకా మోగట్లేదు! గడియారం ఎనిమిదిన్నర దాటేస్తుంది. ఇంట్లో నేను, టీ.వి, కాస్త ఒంటరితనం తప్ప ఇంకెవరూ లేరు? రిమోట్ నొక్కుతున్న వేళ్ళు ఒక్కసారి ఆగిపోయాయి. దృష్టి టీ.విలో వస్తున్న ఆ మాటలపై పడింది.

"మాలో ఒక్కరికీ ఉద్యోగం దొరకట్లేదు! దళితులకి మాత్రం భార్యా భర్తలకీ, వాళ్ళ కుటుంబంలో చాలా మందికి దొరుకుతున్నాయి. రిజర్వేషన్లు మాలాంటి వాళ్ళకు శాపంగా మారాయి." ఇంకా...ఏదో అనర్ఘళంగా చెప్పుకుపోతున్నా డొకాయన! ఈలోగా "అంతేనా... ఇంకెం కావాలి.... వీలైతే నాలుగు మాటలు.... కుదిరితే కప్పుకాఫీ......" సెల్‌ఫోన్ మోగింది. ఆ రింగ్‌టోన్ అంటే నాకిష్టం! ఆ గొంతులో ఏదో అర్థ్రత! ఆ ఆడగటంలో ఏదో ఆత్మీయత! అది నన్నే అడుగుతన్నంత భయం కూడా! గబగబా టీ.వీ. కట్టేసాను. బండి తీస్కుని బయల్దేరాను. రోడ్డు మీద నిలబడ్డాను. నాకళ్లు వస్తున్న ప్రతి బస్సునీ ప్రతి ఆటోనీ వెతుకుతున్నాయి!

అరగంటైయ్యింది! ఏమైంది! ఇంకా రాలేదు. ఫోన్ చేద్దామని వెతికాను. ఆ ఫోన్ మోగిన హడావుడిలో వస్తున్నానని చెప్పేసి దాన్ని ఇంట్లోనే పడేసి వచ్చేశాను.

ఏమైందో.. మా ఆవిడ దయామణిని పొద్దున్న రైల్వే స్టేషన్ దగ్గర దింపి వస్తుంటే కనిపించిన ఏక్సిడెంట్ గుర్తుకొచ్చింది. ఒళ్ళంతా భయం వణికిపోతుంది. పదేళ్ళ క్రితం ఈ రోడ్డు మీద బస్సుగాని ఆటోగాని తిరిగేది కాదు! పొద్దున్న, సాయంత్రం ఒక్కో ట్రిప్పు వేసేవాళ్ళు. హైటెక్ సిటీ వచ్చిన తర్వాత ఈ ప్రాంతం ఎంత రద్దీగా మారిపోయింది...?

టెన్షన్ పెరిగిపోతోంది. ఇంతలో నా దగ్గర్లోనే ఓ కారు ఆగింది. అందులో మా కొలీగ్ డా॥ శ్రీరామ శర్మ వాళ్ళ కుటుంబంతో కలిసి కూర్చున్నారు. "హలో! డేవిడ్ గారూ..! ఇంకా ఇక్కడే ఉన్నారా..మీ మిస్సెస్ కోసమా? అలస్యమైనా పర్వాలేదు. మా సన్మాన కార్యక్రమానికి మాత్రం తప్పకుండా రావాలి. సుమా" అంటూ వెళ్ళి పోయారు. కొలీగ్ కావడమే కాకుండా మేమంతా ఉండే ప్రశాంతీ అపార్ట్‌మెంట్‌లోనే ఉంటారు. ఇద్దరం ఒకే కాలేజీలో పనిచేస్తున్నాం. నాకంటే ఐదేళ్ళు సీనియర్! స్పెషల్ రిక్రూట్‌మెంట్ వల్ల నాకు పర్మినెంట్ ఉద్యోగం వచ్చింది. ఆయన మాత్రం టెంపరరీగానే కొనసాగుతున్నారు. ఆ ఎయిడెడ్ కాలేజీలోనే ఎప్పటికైనా పర్మినెంట్ అవుతుందనే నమ్మకం ఆయనది!

అంతకు ముందు అలాగే చాలా మంది సెటిలయ్యారు కూడా! గవర్నమెంట్ పాలసీలో ఏదో మార్పులు కావడంతో బ్యాక్ లాగ్ పోస్ట్సు భర్తీ చేయాల్సి వచ్చింది. అలా నాతో పాటు మరో ఇద్దరు రిక్రూట్ అయ్యారు. మేము యూనివర్సిటీలో రిసెర్చ్ చేస్తుండగానే స్పెషల్ రిక్రూట్‌మెంట్స్ వల్ల అలా పర్మినెంట్ ఉద్యోగులయ్యాం! 'రీసెర్చ్ చేస్తుండగానే' అనగానే మా వయసేమీ చిన్నదేమీ కాదు. చదువు అయిపోయి బయటకొచ్చేస్తే నిరుద్యోగి అనిపించుకోవాలి. అందుకని ఏమైనా ఉద్యోగం వచ్చే వరకూ నాలాగే చాలామంది రీసెర్చ్ సబ్మిట్ చేయరు. నిరుద్యోగి అనిపించుకోవడం కంటే, సీనియెర్ రీసెర్చ్ స్కాలర్ అని పిలిపించు కోవడమే గౌరవంగా ఉండేది. కే.ఆర్. నారాయణన్ గారు రాష్ట్రపతి అయిన తర్వాత ఎయిడెడ్ కాలేజీ రిక్రూట్‌మెంట్స్ విషయంలో చాలా మార్పులొచ్చాయి. బ్యాక్ లాగ్ పోస్టులు ఫిలప్ చేయకపోతే, ఆ కాలేజీలకి గ్రాంట్స్ అపేయమనేదో రూలొచ్చిందంట. అందువల్ల ఇలా మాలాంటి 'సీనియర్ రీసెర్చ్

స్కాలర్‌కి కొంతమందికైనా ఉద్యోగాలొచ్చాయి. దీంతో నాకంటే ముందు నుంచి ఉద్యోగం చేస్తున్నా, ఆయన కంటే నాకు మూడు రెట్లు జీతం అధికంగా వస్తుండటాన్ని మా కాలేజీలోనే ఎప్పటి నుండో పని చేస్తున్న కొలీగ్స్ తట్టుకోలేక పోయేవారు. అలాంటి వాళ్ళలో డా॥ శ్రీరామ శర్మ గారు ఒకరు. ఆయనకి అయిదేళ్ళ ముందే డాక్టరేట్ పూర్తైపోయింది.! అయినా పార్ట్ టైమ్ గానే ఉండాల్సివస్తుంది. "మా ఖర్మ మా ఉద్యోగాలెక్కడున్నాయి.... మీకేమి వరపుత్రులు..." అని అప్పుడప్పుడూ నవ్వుతూనే బయటకు అనేసేవాడాయన!

బ్యాక్‌లాగ్ స్పెషల్ రిక్రూట్‌మెంట్స్ జరక్క ముందు మావాళ్ళనెవ్వరినీ కాలేజీల్లో ఎందుకు తీసుకోలేదు. వాళ్ళెవరూ కనీసం పార్ట్‌టైమ్‌గా కూడా పని చేయరా? అని అడగాలనిపించేది. అయినా అమాయకంగా ఓ నవ్వు విసిరేసేవాడిని! ఆయనకి జీతం తక్కువేమోగానీ, చుట్టు ప్రక్కలవాళ్ళెంతో మంది ఆయన దగ్గర జోతిష్యం చెప్పించుకోవటానికి వస్తూంటారు. పెళ్ళిళ్ళు, పేరంటాలు, సన్మానపత్రాలు రాయడం వంటి పనులతో కూడా బిజీగానే ఉంటారు. జీతానికి మించి అనేక రెట్లు వచ్చే ఆదాయం. దీనికి తోడు ఇంటి దగ్గర తాతముత్తాతలు సంపాదించిన పొలాలున్నాయి. అవి వాళ్ళు చేయక పోయినా, ఏడాది తిరిగేసరికల్లా, తమకి రావలసినవన్నీ సరాసరి ఇంటికే వచ్చేస్తుంటాయి. అంతేకాదు వాళ్ళావిడ ఓ ప్రయివేటు కాలేజీలో లెక్చరర్‌గా కూడా చేస్తుంది.

ఈమె ఇంకా రాలేదు. ఏమి జరిగిఉంటుందో.
తొమ్మిదైపోతుంది. వంటచేసేయవలసింది. నేను
చేస్తే ఊరుకోదు. వెళ్ళి అంట్లు తోముకోవాలి. ఇళ్ళు
ఊడ్చాలి. వంటచేయాలి. బట్టలు ఉతుక్కోవాలి.
అప్పటికి పదిన్నరో, పదకొండో అవుతుంది.
గుప్పెడు మెతుకులు తిని పడుకుంటుంది.
ఇంకెక్కడ సుఖం...!

గవర్నమెంటు ఉద్యోగమైనా ఆమెకి మా ఆవిడ కంటే ఎక్కువ జీతమే వస్తుంది. పైగా దూరం వెళ్ళక్కర్లేదు! మా ఆవిడకి ట్రాన్స్‌ఫర్ కోసం ఎంత ప్రయత్నించినా...ఖాళీల్లేవంటున్నారు. లెక్చరర్స్ యూనియన్‌లో ప్రధానమైన పోస్టులన్నీ దళితేతరులవే. బదిలీల్లో యూనియెన్ పాత్ర చాలా ముఖ్యం. స్పౌజ్ కేసని చెప్పినా, హెల్త్ గ్రౌండ్స్ అని ఆధారాలు చూపినా దగ్గర్లో పోస్టింగ్స్ మాత్రం రావట్లేదు. సర్వీసు తక్కువున్నా, సిటీ దగ్గర్లో దళితేతరులకు మాత్రం బాగానే ట్రాన్స్‌ఫర్స్ జరుగుతున్నాయి. బదిలీ లీలలు ఏలిన వాళ్ళకే తెలియాలి. రికమండేషన్స్‌కే తెలియాలి. అవినీతికే తెలియాలి.

వేగంగా వాహనాలు తిరుగుతున్నాయి. ఏవో తమకిష్టమైన రీతిలో హారన్స్ చేసుకుంటూ పోతున్నాయి. నా ఆలోచనలు మాత్రం ఎలాగో వెళ్లిపోతున్నాయి. ఈమె ఇంకా రాలేదు. వెనక్కి వెళ్లి ఫోన్ పట్టుకొద్దామా అనిపించింది. వద్దులే మళ్ళీ నేనిలా వెళ్ళిన వెంటనే ఆమె వచ్చేస్తే..... ఎంత బాధ పడుతుంది. రోజూ వెళ్ళడం...రావడం...వంద కిలోమీటర్లు! అయినా ఈ అర కిలోమీటర్ దూరం రాలేదా...? రాగలిగినా నేనిప్పుడు కనిపించకపోతే ఎంత ఫీలయి పోతుంది.

బుర్ర వేడెక్కిపోతుంది.

ఇందాకే టీ.వీ.లో చూశాను. ముంబాయిలో జరిగిన టెర్రరిస్టులతో సంబంధం ఉన్న వాళ్ళు హైదరాబాద్‌లో కాల్పులు జరుపుతూ ఒకరు దొరికారని.



ఇంకా అనుమానాస్పద వ్యక్తుల్ని అరెస్ట్ చేసామని పోలీసుల ప్రకటన. ఈమె ఇంకా రాలేదు. ఎక్కడుందో..డబ్బా ఫోన్ నుండి ఫోన్ చేద్దాం అనిపించింది. చుట్టూ చూశాను. మహానగరంలో మహా అరణ్యం! దాని కోసం అరకిలోమీటరు దూరం వెళ్ళాలి. దానికంటే ఇంటికి వెళ్ళే ఫోన్ తెచ్చుకుంటేనే బాగుంటుందేమో!

జేబులో ఓ బి.పి బిళ్ళ తీసుకున్నాను. అటూ ఇటూ చూశాను. ఆ దగ్గర్లో నీళ్ళు లేవు. అలాగే నోట్లో వేసేసుకున్నాను. నాలుగు పదులు నిండకుండానే బి.పిలు, షుగర్లు! గొంతులో దిగలేక దిగుతుందా చిన్న బి.పి బిళ్ళ! ఆటోలొస్తున్నాయి. ఆయె ఇంకా రావట్లేదు. రావల్సిన వాళ్లు రావట్లేదు. రాకూడని షుగర్ మాత్రం అప్పుడే వచ్చేసింది. డా॥ శ్రీరామ శర్మ సన్మాన కార్యక్రమం.. ఇప్పటికే ప్రారంభమైయ్యుంటుంది.

చిన్నప్పుడిలాగే అమ్మానాన్నా పనికెళ్ళి అర్ధరాత్రికి వచ్చే వాళ్ళు. వాళ్ళ కోసం చూసి చూసీ ఎప్పుడో నిద్రపోయేవాడ్ని. నన్ను నిద్రలేపి అన్నం తినిపించే వాళ్ళు. చేతిలో మొర మొరాల ఉండనో, జీళ్ళనోపెట్టేవాళ్ళు. అలా తింటూనే నిద్రపోయేవాడినంట. పొద్దున్నే అయినా వాళ్ళని చుద్దామంటే తెల్లారగట్లే వెళ్ళిపోయేవారు! మెలకువ వచ్చి ఎప్పుడు చూసినా అమ్మ రాత్రంతా పని చేస్తూనే ఉన్నట్లుండేది. మా ఆవిడ కూడా ఇప్పుడంతే! ఒక్కోసారి 'అయ్యో తెల్లారిపోయిందా? ట్రెయిన్ వెళ్లిపోతుందేమో' అనే కలవరింతలు.

గొంతులో వేసుకున్న బిళ్ళ లోనికి వెళ్లిందో లేదో గాని ఏదో అడ్డుకున్నట్లనిపిస్తుంది. బస్సుల్లో ఆటోల్లో దిగేవాళ్ళు తప్ప, నాకింకెవరూ కనబడట్లేదు. ఒక్కసారిగా ఆ రోడ్డు మీద పెద్ద శబ్దం. ఓవర్ టేకింగ్ చేయబోయి ఓ స్కూటర్‌ని గుద్దేశారు మోటారుబైక్ మీదున్న ఇద్దరు యువకులు! ఇద్దరూ పడిపోయారు.

పరిగెట్టికెళ్ళాను. స్కూటర్ మీదున్న అతనికీ, ఆ వెనక కూర్చున్న అబ్బాయికీ దెబ్బలు తగిలాయి. ఆ అబ్బాయి లెగలేకపోతున్నాడు. మా రీసెర్చ్ సూపర్‌వైజర్ సన్మానానికి బ్యానర్ కట్టడానికి వెళ్తున్నప్పుడు నన్నూ ఓ స్టూడెంట్ ఇలాగే గుద్దేసాడు. అప్పుడు మా సూపర్ వైజర్ గారి హజ్బెండ్ బండి నడుపుతున్నాడు. నేను బ్యానర్స్ పట్టుకుని వెనుక కూర్చున్నాను. నాకు దెబ్బలు తగిలాయి. చాలాసేపు లెగలేక పోయాను. నడుం లేపలేకపోయాను. అక్కడో కారుంటే దానిపై తీసుకెళ్ళారు. ఎక్సరే తీశారు. రెండు రోజులు హాస్పటల్‌లో ఉన్నాను. కొంచెం చిన్నదెబ్బ తగిలిందన్నారు. వెన్నుపూసకీ, కిడ్నీకీ చిన్న దెబ్బ తగిలిందన్నారు. మందులు వాడితే తగ్గిపోతుందిలే అన్నారు. ఎక్సరేలో చూసిన నాకేదో అనుమానం వచ్చింది. అది జరిగిన సంవత్సరం తర్వాత నుంచీ నాకు షుగర్ ఎటాకైంది. దేనివల్ల జరిగిందో ఆ డాక్టర్లకే తెలియాలి. ఇప్పుడీ పిల్లోడికేమవుతుందో అనుకుంటూ లేపాను. పక్కకు తీశాను. ఈ లోగా బైక్ మీదున్న వాళ్ళు స్కూటర్ యజమాన్నే నాలుగు తిట్లు తిట్టేసి ఆగకుండా వేగంగా వెళ్లిపోయారు. కాసేపున్న తర్వాత వాళ్ళు అలా బాధ పడుతూనే అదే స్కూటర్‌పై ఎలాగో బాధ పడుతూ వెళ్లిపోయారు.

ఈమె ఇంకా రాలేదు. ఏమి జరిగిఉంటుందో. తొమ్మిదైపోతుంది.

వంటచేసేయవలసింది. నేను చేస్తే ఊరుకోదు. వెళ్ళి అంట్లు తోముకోవాలి. ఇళ్ళు ఊడ్చాలి. వంటచేయాలి. బట్టలు ఉతుక్కోవాలి. అప్పటికి పదిన్నరో, పదకొండో అవుతుంది. గుప్పెడు మెతుకులు తిని పడుకుంటుంది. ఇంకెక్కడ సుఖం...!

ఇంట్లోకి పనిమనిషి దొరకట్లేదు. మా అపార్ట్‌మెంట్‌లోనే ఉంటున్న డా॥ శ్రీరామ శర్మ గారికీ, మిగతావాళ్ళకీ పని మనిషి దొరుకుతుంది. వాళ్ళెంత విసుక్కుంటున్నా దొరుకుతున్నారు. మాకెందుకో దొరకట్లేదు! ఒకవేళ ఎవరైనా పని మనుషులు వచ్చినా, రెండు మూడు రోజుల తర్వాత మానేస్తున్నారు. మా పక్కిళ్లలో చేస్తున్నా, మా ఇంట్లో ఎందుకు చెయ్య ట్లేదు...? వాళ్ళ కంటే బాగానే చూసుకుంటాం. జీతం బాగానే ఇస్తాం. వాళ్ళకంటే మేము ఎక్కువగానే పనిమనిషితో మాట్లాడుతాం. ఆ మాటా ఈ మాటా మాట్లాడుకుంటూ కులం ప్రస్తావన కూడా రాక తప్పదు కదా. అదే తప్పయిపోతుందా? ఏమో... ఎందుకిలా జరుగుతుందో నాకర్థం కావట్లేదు.



ఆమె ఇంకా రావట్లేదు! ఆటోలాగుతున్నాయి. బస్సులాగుతున్నాయి. ఎవరెవరో దిగుతున్నారు. ఈమె మాత్రం రావట్లేదు. నాకు ఆందోళన పెరిగిపోతుంది. మళ్ళీ ఇంకో బి.పి. బిళ్ళ వేసుకోవాలా...?

ఛీ...ఈ డాక్టరొకడు దూరం తిరగొద్దన్నాడు.. డయాబెటిస్ వల్ల ఎన్ని సమస్యలు. ఈ.సీ.జీ. ఎన్నడూ నార్మల్‌గా రావట్లేదు! మందులు వాడుతున్నానని చెప్పినా వద్దంటున్నాడు. దూరం ప్రయాణం చేయొద్దంటాడు. లేకపోతే నేనే ఆమె ఉద్యోగం చేసే దగ్గర నుండి వస్తే సరిపోతుంది కదా! పోనీ, మాఅమ్మానాన్నా గానీ, వాళ్ళ అమ్మానాన్నాగాని మన ఇంటి దగ్గరే ఉండొచ్చుకదా. వాళ్ళుండరు. ఏడాదికి ఒకసారో రెండుసార్లో వస్తారు. తప్పనిసరి పరిస్థితుల్లో వాళ్ళకి టీ.వీ. చూపించేసి మా పనుల్లో మేము బిజీ అయిపోతున్నాం. వాళ్ళతో మాట్లాడాలని ఉన్నా, టైమేది? పోనీ, గ్రామంలో మాట్లాడినట్లు ఈ అపార్ట్‌మెంట్‌లలో వాళ్ళతో ఎవరు మాట్లాడతారు. మేము ఆఫీసుకి వెళ్ళిన తర్వాత తలుపుతీయాలంటే చచ్చేంత భయం. ఎవరొస్తారో.. పట్టపగలే దొంగలు. పోనీ వాళ్ళు ఆడుకోవడానికో పిల్లో, పిల్లోడో ఉన్నా బాగుండేది. ఉద్యోగం వస్తేగాని పెళ్ళిళ్ళు చేసుకోమని మాఇద్దరమూ మొండిపట్టుతో కూర్చున్నవాళ్ళమే.

చిరాకు చిరాకు అనిపిస్తుంది. హారన్ మోతలు. రోడ్డు ప్రక్కనే నిలబడ్డ నా మీదెంత దుమ్ము పేరుకుపోతుంది.

సెల్‌ఫోన్ ఉండీ, ఇప్పుడు దగ్గర్లేదు... ఏం ప్రయోజనం... ఆమె ఫోన్ చేస్తుంటుంది. తియట్లేదని ఎంత కంగారు పడిపోతుందో. ఎంత విసుక్కుంటుందో. ఎందుకు తియ్యట్లేదనుకుంటుందో. ఎవరెవరికి చేస్తుందో. ఎప్పుడే కబురు వినాలని భయపడుతుందో.... సతీ సావిత్ర కథల్తో పెరిగినామె. వాళ్ళింటిలో పెద్దకూతురు చిన్నోళ్ళందరికీ పెళ్ళిళ్ళు చేసి, తాను మాత్రం అలాగే మిగిలిపోవాలనుకుందట. అలాంటప్పుడు నేను కలి శాను. ఆమెలో కొత్త వసంతం వచ్చినట్లు ఫీల య్యింది. అది నావల్లలిలా గ్రీష్మంలాగో, శిశిరంలాగో మారిపోతుందనుకోలేదు. దేనికోసం ఇలా నాకోసం తపిస్తుంది. నన్ను చూస్తే చాలంటుంది. ఆవెుది అమాయకత్వవెూ, అచంచలమైన ప్రేమతత్త్వమో నాకే తెలియట్లేదు. అలాంటామె ఇప్పుడు నాకు సెల్ ఉండీ, దగ్గర పెట్టుకోనందుకు ఏం కోపం పడు తుందో... ఆమె ఎలా రియాక్ట్ అవుతుందో.... ఆలో చనలు అలా అలా సాగిపోతున్నాయి. ఓ ఆటో ఆగింది. చేతిలో రెండు బ్యాగ్స్, దాని నిండా కూరగా యలతో ఆమె! హమ్మయ్య...నన్ను చూసింది. ఏదో చిన్న బోయిన కళ్ళతో ఆమెను చూశాను. జాలిగా చూశాను. ఓ చిరునవ్వు నవ్వాను. సిరిమల్లెలు కురిపిస్తూ దగ్గర కొచ్చేసింది. ఆమె చేతిలోని సెల్ తీసుకున్నాను..... "అంతేనా...ఇంకేమి కావాలి..... వీలయితే నాలుగు మాటలు..... కుదిరితే కప్పు కాఫీ..." అనే రింగ్‌టోన్ పెట్టుకున్నాను. ఏమి చెప్పాలో తెలియట్లేదు. ఆమె కళ్ళలో మాత్రం ఎంత తృప్తో! "నిన్ను చూస్తే చాలు నాకు. నష్టాలన్నీ మర్చిపోతాను. నా జన్మకదిచాలు..." ఏదో చెప్పుకు పోతూనే బైక్ ఎక్కేసింది. ◆

# చంద్‌ముక్త్

అగ్ని -
దహించేసాక
వొకింత ప్రేమ వొలికింది -

నెపమేమీ లేదు
నువ్వులేని పూట
నీ ఇంటి గొళ్ళెం తట్టాను

ఎవరికెంత ప్రాప్తమో
నాకెందుకు ?
నాకెంత భాగ్యమో
పరీక్షించుకోవాలి !

ఈ కాలం కోకిల
రోజూ పాడుతుంది
కాకపోతే
తీరిక సమయానికి
నిద్రపోతూంది !

ప్రేమలో
మునగడానికి ముందు
దగ్ధమవ్వడం నేర్చుకోమంది !

ఎవరు భరిస్తారు ఈ భారం
పారిపోవడమెంత సుఖమో
ఎవరి నెపమూ వుండదు!

దారి చూపే
నెపం ఎంచి
నిర్గమ్యం చేసింది!

తొలి కౌగిలింత నీంచి
విడిపోతూ
మన కలయికకు
పరమార్థమేమిటని అనడిగాడు -
ప్రళయారంభం అని
చిర్నవ్వుతూ వెళ్ళింది !

మరణానికి కొంచెం ముందుగూడా
గడపపైనే కనురెప్పల వాలు
ఎవరో వచ్చినట్లు భ్రమింప చేస్తూ
గొళ్ళాన్ని తడుముతూ వాయునర్తన -
దీన్నే లోకులు నిరీక్షణ అనంటే
ప్రేమికులు ఆత్మబలిదానం అని
నిట్టూర్చుతారు.

- ఇక్బాల్ చంద్